శ్రీ

# విధిలేక వైద్యుఁడు

మాలియర్ అను ఫ్రెంచ్ కవీశ్వరుఁడు వ్రాసిన
నాటకమును అనుసరించి

వేదము వేంకటాచలయ్య

వ్రాసినది.



(ద్వితీయ ముద్రణము.)

చెన్నపురి.
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ
బ్రకటితము.
1927

To

. / . Yates, ˉsq., V./ .

This Book

is

by permission

Dedicated.



# PREFACE.

THE history of the stage all over the world has stamped it with a pronounced tendency to the representation of religious and mythological stories. In India the tendency has acquired all the elements of character. If, on the one hand, it has kept alive the popularity of the stage, on the other hand it has dwarfed the development of the drama. It is only in recent times that it has come to be slowly realised that the drama deals with life and that life is not to be found—at least exclusively—in mythology and romance. It was something of a discovery that life was to be seen in our very streets and market-places.

To draw out the drama from its favourite haunts in royal palaces and ancient times would thus be seen to be even a process of education. The adaptation in Telugu of Moliere's "Physician in Spite of Himself," presented in the following pages, was attempted by me as an experiment on the suggestion and encouragement of my friend Mr. V. V. Srinivasa Aiyangar who has never missed being helpful with new ideas.

I have latterly been much pained to observe a deplorable liberty taken by present-day playwrights with Geography and History under the plea of romance. But I never knew that it was supposed

# నాటక పాత్రములు

---

| | |
|---|---|
| గంగన్న. | కట్టెలమ్మి జీవించువాఁడు. |
| లచ్చన్న. వెంకడు. | గురప్పనాయుని నౌకరులు. |
| రామోజి. | గంగన్న పొరుగింటివాఁడు. |
| గురప్పనాయఁడు. | ఒక ద్రవ్యవంతుఁడు (లక్ష్మమ్మతండ్రి). |
| లింగమనాయఁడు. | లక్ష్మమ్మను పెండ్లాడ నెంచినవాఁడు. |
| తిమ్మారెడ్డి. పెద్దబ్బి. | గ్రామస్థులు. |
| లక్ష్మమ్మ. | గురప్పనాయుని కూఁతురు; లింగమనాయుని పెండ్లాడ గోరినది. |
| మల్లక్క. | గంగన్న భార్య. |
| జానకి. | గురప్పనాయుని యింటి దాది. |

---

| | |
|---|---|
| స్థలము. | నెల్లూరుజిల్లాలోని ఇందుకూరుపేటయును, పొరుగున నుండు గ్రామమును. |

---



శ్రీరస్తు.

# విధిలేక వైద్యుఁడు.

---

## మొదటియంకము - మొదటిరంగము.

---

[ఒకగుడిసెముందు గంగన్నయును, మల్లక్కయును
తగవులాడుచు ప్రవేశింతురు.]

గంగన్న—ఇదిగో, నేశెప్తాయిను. అదేదీ సరిపడదు. కద్దన్నా లేదన్నా నే ననాల్సిందే. నేను యింటికి పెద్దను.

మల్లక్క—మరి నే శెప్తా యిను. నా మఁనుచట్లా నూ నడుచుకోను చుండాలె. నీపోకలట్టల్లా యిడిశిపెట్టడాన్కి నిన్ను నే పెళ్ళాళ్లేదు.

గంగ.—అబ్బా! బార్యవుండేది మారిగుండాది-‘ఆలు కాదది తేలు’ అని యేమన్న శెప్పింది బలేనిజం, బలేనిజం.

మల్ల.—ఆ! యీఁని తెలివి సూడు. ఈని తెలియికి యేమన్న తెలియిసాటు. బలే తెలియి, బలే తెలియి.

గంగ.—ఔను. బలే తెలియే. కాకేఁ. నాహాలె మోపులు కట్టేవోణ్ణి ఓణ్ణి తేసూతాం. ఆరేల్లు వాయిద్దెం అయ్యవోరవొద్ద సంచి మోస్తా సదివినోణ్ణి శిన్నప్పుడు. మొదటి పాట మంతా గుడ్డిపాటంగా వొప్పగిస్తుండి నోణ్ణి.

మల్ల.—ఇంటిలోటివోటినంతా ఓటోటిగా అమ్మతా—

గంగ.—అది సొంతవర్తులో జీవన మాయెను.

మల్ల.—నే కప్పకొనే దుప్పటికూడా యెత్తుకెళ్లి—

గంగ.—పెందలాడే నిద్ర లేవగలవు.

మల్ల.—కడకు యింతా యింటిలోను నాకొక్క పుల్లకూడా లేక శేశి—

గంగ.—శేతులు కాళ్లే కడ్డం లేక తిరుగుతుం డొచ్చును.

మల్ల.—పొద్దస్తమానాలు జూదం, తందనపదాలు తప్ప మజ్జెం పసలేక—

గంగ.—ఇక్కడి యింటి యేడ్పుల శింత లేకుండుటకు.

మల్ల.—ఈయింతా కాపరాన్ని నే నేమి శెయ్యాలెనని యెంచుండావు.

గంగ.—నీ యిష్ట మొచ్చినట్లు.

మల్ల.—శేత నలుగురు బిడ్డ లుండారు—

గంగ.—నేలమీద యిడిశిపెట్టు.

మల్ల.—ఎప్పుడు సూశినా, ఆకలాక లంటా, కూడుకూ డంటా మొత్తుకుంటా.

గంగ.—తలా కొంచం పేంపల్లియ్యి. నాకు కావాల్సినంత తినను తాగను ఉంటే అప్పుడు తలా ఓడోడూ ముక్కు మునగ తినాల్సిందే.

మల్ల.—అట్టయితే, యీయాట లిట్టే యెప్పుడూ సాగించాల్నని తలస్తుండావా? తాగుపోతా!

గంగ.—ఆగు! ఆగు! ఇది గోసేవ్ ; తిన్నగా! సుతలాయిం చుకో.

మల్ల.—దొంగ! దిక్కుమాలిన గాడిదా! ఆకతాయి! మన్ను పోతా! ముచ్చా!

రంగ.—సరిసరి, యిక తిను తిను కడుపార. (కొట్టును.)

మల్ల.—అయ్యయ్యో! అయ్యయ్యో! నీ చేతులు పడిపోను. నిన్నూడ్చుకపోను.

రంగ.—నీ నోరు మూయించుట కిదే దారి. (మరలకొట్టును.)

[రామోజి ప్రవేశించును.]

రామోజి—ఆహా! హా! హా! అయ్యయ్యో! ఏమిది? ఏమిది? మీరు నాశనమైపోను. ఏమి యీ శిగ్గుమాలినతనం. ఇట్టా కూడా భార్యాను కొట్టొచ్చునా! ఆరేరే! నీ చేతుల్పడిపోను.

మల్ల.—(నడుములపై చేతులుంచుకొని, రామోజీని వెనుకకు పొమ్మని సైగచేయును) ఆయన కొట్టేది నా యిష్టమే.

రామో.—ఆహా! సరే! నేనును మనుసార వొప్పుతాను.

మల్ల.— అది నీకేల?

రామో.—నాది పొరబాటే.

మల్ల.—నీ పనా?

రామో.—నిజమైన మాట.

మల్ల.— తలబిరుసువోడా! మొగుడు పెళ్లాన్ని కొడ్తే అడ్డమొస్తావ్?

రామో.—అందుకై నేను వెసనపడ్డాను.

మల్ల.—ఇందు కేమంటావు?

రామో.—ఏమీ లేదు.

రామో.—సరే, సరే.

గంగ.—నీ జోలిమాలిన పనుల్లో నూ తలపెట్టటం శిగ్గుమాలినతసం. తెలుసునా? సుమతి శెప్పింది గ్యాపకం శేస్కో. "ఆలు మొగుడును శేరి గుద్దులాడంగ వొద్దనొద్దనే వోడు సుద్ద మెదవ" అనే దాన్ని. (భార్యయొద్దకు వచ్చి చేయిపట్టుకొనఁబోయి) ఏమేయ్! ఇద్దో! ఇంకపాలు, మనం రాజీ ఐపోదాం, రా ఏదీ నీ శెయ్ తే.

రామోజి వెళ్లిపోవును.

మల్ల.—ఊఁ ఊఁ! నన్నిట్టా కొట్టేశి.

గంగ.—అది పోనీలే! నీ శెయ్ తే.

మల్ల.—ఊఁహూఁ! నే నీను.

గంగ.—ఆఁ!

మల్ల.—ఊఁహూఁహూఁ! నే నీను.

గంగ.—ఇద్దో! పిల్లోవ్!

మల్ల.—ఊఁ! హూఁ! హూఁ! హూఁ! హూఁ! నే నీను.

గంగ.—ఇద్దో! ఇట్రా శెప్తా.

మల్ల.—నే రాను, నేరానూ. నే దానే రాను.

గంగ.—రా రా! రా.

మల్ల.—రాను, నే రాను; నే నలుగుతాను.

గంగ.—రా రా, ఇయంతానా; రా రా.

మల్ల.—నా జోలికి రావొద్దు.

గంగ.—ఇద్దో! నీ శెయ్యియ్యంటే.

మల్ల.—నన్ను శానా శానా బాదినావే నువ్వు.

## రెండవరంగము - ఊరిబయలు.

---

[లచ్చన్నయును వెంకిగాడును బ్రవేశింతురు.]

లచ్చన్న—ఇదేందిరా పాడు గుండాది పని. ఎవడు శిక్కుతాడో లేడోగాని, కుక్కలాగు తిరుగులాడే గతి పట్టింది మనకు. ఎందు కొప్పుకొంటిమో యీ పీడ పనికి.

వెంకన్న—ఏం శెయ్యమంటావ్ మామా? యాజమాన్లు శెప్పినట్టల్లా నౌకర్లం మనం యినాల్సిందేగదా. మరి ఆయన కొమార్తె ఒల్లు కుదిర్తే మనకూ సంతోసమేగదా. ఆమా మన యజమానురాలేగదా. రోగమొచ్చి దైవాదీనంగా యీ పెళ్లి నిలిశిపోయిందేగాని, లేకుంటే యీపాటికి ఆమెకు పెళ్లైగినా అయ్యుంటే, మనకెంతా యెంతా సంతోషం ఎంతా యినాములు దయశేస్తురు. ఏం- మరీ మామా! ఆయిణ్ణి పెళ్లిశేసుకోవాలె అనేవోరిలో ఆ ఆదూరు ఆదెప్పనాయుడు మంచి దానాకర్ణుడు. ఆయనే ఆమెను పెళ్లి శేసుకోగల్లోడు. కాని, మరి, అ దేమూ రది, ఆఁ అల్లూరు. అల్లూరోళ్ల శిన్నోడు లింగమ నాయడిమీద అదేమో గాని ఆమెకు మణుసుండాది. అతడు అల్లు డయ్యేది అబ్బకు మణుసు లేదు.

[మల్లక్క ఒక ప్రక్క ప్రవేశించును.]

మల్ల.—(తనలో) నా పగ తీర్చుకొనేందుకు యింతకన్నా యిక మరేందారి లేదా?

దాలు పెట్టుకొని, మెందరి శాతనో కానివాన్ని సాదించ గల్లోడు నూటికో కోటికో ఎవడో ఓకుండాగల్లోడు. అట్టాంటి మాశిని మేము యెదుకుతుండాం.

మల్ల.—(తనలో) ఆఁహాఁహాఁ. ఆకుక్కకొడుకుపైన నా కశి తిర్చుకొనేందుకు ఆ బగమంతుడు శేశిన యుక్తి యిది. (వారితో) మీకు కావాల్సిన యిసయం యింతకన్నా సక్కంగా శెప్పగల్లామాశి మీకింగోడు శిక్కరు. మరిగా నిండి యీడోడుండాడు సావబొయ్యేరోగాలకు ఆయన కన్నా వొయిద్దెంశేయగల్లా మాశి, యీడాణ్ణోగాడు లోకంలోనే లేడు.

వెంక.—ఆఁ హాఁ! అట్టనా! దయశేశి శెప్పమ్మా ఆయన యాడశిక్కగలడో.

మల్ల.—అల్లదిగో! ఆసోట ఉంటూ డిన్నాడు; నూడ్డొచ్చు కట్టె ల్నరుక్కుంటూ యేడుగ్గుంటాడు.

లచ్చి—వొయిద్దులు కట్టె ల్నరకటమా! [అదేనా.

వెంక.—మూలికలు పెల్లగించుతుండాడు గామాల. ఔనా,

మల్ల.—కాదు. ఆయ నోమూవిరి యింతమాశి; ఆ యిదంగా కుశాలుగా ఉంటాడు. ఆయనగుణా లన్ని బలేయింతలు, యిపరీతాలు, నిలక ల్లేనియి. మరండీ నిజెంగా ఆయ నెట్టి వాడో మీరు కనుక్కోలేరు. యెప్పుడూ యేసమేసుకొనే తిరుగుతుంటాడు. ఒకప్పుడు ఏఁయీఁ తెలియనివోనిలాగ పైకవుపడ్తాడు. తన యిద్దెల నంతా బగు రగిశ్యంగా పెట్టు కొంటాడు. ఆదేముడు నాకేల యింత మంచియిద్దెం యిచ్చి నాడా అని రోజూ యిసుక్కుంటుంటాడు.

వెంక.—అయితే ఆయన నూ శెప్పినంత సామర్తెం గల్లోడేనా?

మల్ల.—ఆహా. ఆయన శేశే పను లుండాయే అయి దైవాద్భుతాలు. ఆశ్చెర్యమైతే మరోటి శెప్తా యినండి, ఆర్నెల్లనాడు, ఓ ఆడబాయశాలికి రోగమొస్తే వాయిద్దులందరు అసాద్దెం బతకలేదని శెయ్యిడిశిపెట్టినారండి. మరి రొండు జాముల దాకా ఆమె సచ్చింపనే వారందరు అనుకోని యేడవటం కూడా మొదలుపెట్నారు. ఇక వాల్ల కాటి కెత్తుకొనిపోను శిద్దంకూడా శేస్తున్నారండి. ఆపాటికి ఓ రోగాని,యీయున్ని బలమంతంగా ఆడికి యీడ్చుకొచ్చినారు. ఈడ్చుకొస్తే, ఈన ఆమెను కొంచం శేపు అట్టేసూశి, పటకారుతో నోరు తెరిపించి, అదేంటో ఒక మందు ఒక్క సుక్క పోశినాడు. పోశినాడో లేదో, మరి నారంగా! ఆ యాడామె లేశి, కూకోని, ఏమీ రోగం లేనిదానివల్నే ఇల్లంతా నడిశి తిరగసాగింది.

లచ్చ.— ఆఁహాఁ!

వెంక.— అదేందో అదేంది, ఆఁ ఆఁ అది సంజీవిగా వుండి వుండాలె

మల్ల.—ఔను గామాల. మరింగోటి ఇప్పుడేనండీ యింకా నెల్రోజులుకూడా గాలేదండి. మరి—అముదాలపాల్లో, పన్నెండేండ్లపిల్లోడోడు, సారవకింద తాటిశెట్టెక్కి ఆణ్ణుంచి కిందాపడ్డాడు. తలపుర్రె పగిలింది. కాలుశేతులు యిరిగింది. యెంటనే ఆ పిల్లోణ్ణినలుగురూ శేరి ఓమంచం మీాదేసుకొని యీానకాడికి తెచ్చినారు. ఆ మొయిన యీాన ఓ సత్తు

# మూఁడవరంగము - ఊరివెలుపలి యడవి.

---

[చేత నొక్క సారాయిబుడ్డితో గంగన్న పాడుచుండఁగా లచ్చన్నయును వెంకన్నయును ప్రవేశింతురు.

గంగ.—(నఱికిన కట్టెలను చూచుచు) అబ్బ! నిజంగా పూట పనికన్న యక్కువైంది. ఇంకా కొంచం అలుపుతీర్చుకుంటా (అని ఒకమొద్దుపై గూర్చుండి, బుడ్డిలోని సారా త్రాగి) ఓశే దీనబ్బ డాలింది యీ యాల యిదేందో బలే వొగురుగుండాది. (పాడును). మల్లాతాగుతా. (త్రాగి) ఇంక మీదట వానంగడొద్దు. ఛూ. (పాడును).

వెంక.—ఎవరో పాడుతా కట్టెలు నరుకుతున్న ట్లినబడుతుండాది. అది అతడేనా?

లచ్చ.—ఔ. అతడే సక్కంగా ఆయనొద్దికే వొచ్చినాం.

వెంక.—దగ్గిర కెల్దాం.

గంగ.—ఆఁ పిల్ల నాకొండ ఇంకోతూరి నిన్ను ముద్దేస్కుంటా. (మరలత్రాగి పాడుచు, వారు దగ్గఱకు రాగనే ఒకని వెంబడి నొకని జూచుచు తిన్నగా) దరిద్రం మొవ రిల్లు?

వెంక.—నిజంగా ఇతడే అతడు.

లచ్చ.—ఆఁ, ఔ, ఆయనే. ఆమె మనకు శెప్పినాయనే. ఆయ్నే.

గంగ.—(వచ్చినవారిలో నొకడు వంగి దండము పెట్టబోవును. తనసీసా వా డెత్తుకొను నేమో నని దానిని మఱియొక

ఆశ్చర్యపడొద్దండి. ఎప్పుడూ మంచి సామర్త్యం గలోళ్లనే జనులు యెతుక్కుంటారండి.

గంగ.— నిజమేనండి. కట్టెమోపులు కట్టే యిసయంలో నావొంటివారు యెక్కడాలేరు. అంటే, లోకంలోనే లేరండి.

వెంక.—ఆహాఁ! అయ్యా—

గంగ.— నేను కష్టపడేందుకు యెనక్కుతీయను. మరి నాపనా, బలే పొందిగ్గా ఉంటది. అది యిట్టుంటే బాగు, అని వోరుగాని సెప్పేందుకు యీలుండదండి. ఊఁ హూఁ, ఉండనే ఉండదండి.

వెంక.—అయ్యా! మరి మే మొచ్చింది ఆపనిమీద గాదండి.

గంగ.—కాని, అయి ముచ్చవలానికి నూరు వంతున అమ్ముతాను.

వెంక.—దయచేసి యిక ఆమాట యిడిచిపెడదామండి.

గంగ.—అంతకు తక్కువ యీయనని దిట్టంగా సెప్పుతుండానండి.

వెంక.—అయ్యా. ఏదేది ఎట్టెట్టో అది మే మెరుగుదుమండి.

గంగ.—ఏదేది యెట్టెట్టో మీరెరిగుంటే, నే నమ్మేది యిట్టా అని కూడా యెరుగుదురు.

వెంక.—యేళాకోళం సేస్తుండారండి. మరి—

గంగ.—యేళాకోళంగాను, అంతకు తక్కువ తీయను.

వెంక.—దయచేయండి; మనం యేరే మాట మాట్లాడ్దామండి.

గంగ.—తక్కువ దర కిచ్చేవోరి నెవరినన్నా సూసుకోండి. దిండ్లకేం; కావల్సినయ్యుండాయి. అన్నిదింట్లు దిండ్లవుతాయా. కాని, నేగట్టినయి.—

గంగ.—అంటే ?

వెంక.—అంటే మాకు యిష్టంలేనిపని శెయ్యాల్సివొచ్చునండి.

గంగ.—ఓరి దేవుడా! దేవుడా! ఆఁ సరి, సరి; మీాయిష్ట మొచ్చినట్లు శేయండి. నేను వొయిద్దుడూ గాను; గియిద్దుడూ గాను. మీామాట లేమీా వొక్కటీ నాకు తెలవటం లేదు.

వెంక.—(లచ్చన్నతో) సరి. యిక మన మందు తినిపించాల్సిం దనే తోస్తుంది. (గంగన్నతో) మ రింగోతూరి అడగతా మండి. మీారు పలానా అని ఒప్పుకోండి.

లచ్చ.—ఇదిగో, ఇక యీా మాయమాటలు మావొద్దొద్దు. మీారు వొయిద్దులని పరిస్కారంగా శెప్పేయండి.

గంగ.—నాకేమో తబ్బిబ్బౌతుండాది.

వెంక.—అందరు ఎరిగినదాన్ని లేదంటే లాబ మేమి?

లచ్చ.—ఈ బొంకేల? కార్యమేమి?

గంగ.—ఇద్గో, అయా! ఓపా లన్నా అదే, మరి యెయ్యేసార్లన్నా అదే; ఆ వొక్కమాటే. నేను వొయిద్దుడు గానూ అనేదే.

వెంక.—మీారు వొయిద్దులు గారా?

గంగ.—కాను.

లచ్చ.—మీారు వొయిద్దులే గారు ?

గంగ.—కా నంటుంటె.

వెంక.—సరి. మీాయిష్ట మట్టుంటే, మేమును అందుకు శిద్దం కావాల్సిందే—(ఇరువురును కర్రలతో వానిని బాదుదురు.)

లచ్చ.—మీా రిప్పుడన్న మాటలు యినేందుకు నామనుసు బలే ఆనందంగుండాది.

వెంక.—ఇదిగో (హృదయము తట్టిచూపుచు) ఈప్పుడీ చెప్తా. సాలా కోర్తా మన్నించాల్నని.

లచ్చ.—మేం చేశిన యీా శాతలంతా పాటిం చొద్ద కోర్త నండి.

గంగ.—(తనలో) సుగపడ్డానురా దేవుడా! నేను నిజంగానే మోసపోలెనా, నేర్చుకోకనే వొయిద్దు ణ్ణయినానా?

వెంక.—అయ్యా! మీారు పలానా అని వొప్పుకొంటిరి గాన యింక మీారు శింతించేందుకు కారణ ముండదు. మీారు బలే శానా సంతోషం పడపోతారండి.

గంగ.—సరేగాని. అయ్యా! మీా రేమన్నా పొరబాటు పడ్డారేమో, నేను నిజంగా వొయిద్దున్నేనా?

లచ్చ.—ఔను; నిజమే!

గంగ.—అట్లె, నిజమే?

వెంక.—సందేగం లేదు.

గంగ.—నే నెరిగి సచ్చినట్టే!

వెంక.—ఏమీా, మీావొంటి సామర్తెం గల్లోరు యీా లోకం లోనే లేరండి,

గంగ.—ఆఁ! హాఁ!

లచ్చ.—ఇన్నని తెలీదు గానిండి. యెంద రెందరికో, యన్నె న్నోరోగాలు కుదిర్చినారండి.

వెంక.—యేమిక మాటలే యితని కిష్టం. రండి; అయ్యా! రండి.

గంగ.—మరి పెద్ద శాలువ, జోలా అదీ లేకనే?

వెంక.—మే మేమన్నా తెచ్చిస్తాం లెండి.

గంగ.—అయితే యీ సీసామాత్రం పట్టుకొనిరా. అందులో ఉండాయంతా. పోదాం రాండి.

(అందఱును వెళ్లిపోవుదురు.)



వెంక.—కాని, నిజంగా అయ్యాంతా ఆయన యిద్దైలండీ. కొన్ని యేళ్లోనండీ ఆయన ఓకిక్ తెలియనియ్యాంతా శెప్పుతుంటాడండి.

లచ్చ.—మరిగానండి, సతలాయించుకొని మాట్టాడ సాగితే నండీ శాలెపుస్తకం పట్టుకొని నదవేట్టు దబదబదబ మాట్టాడేవోడండి.

వెంక.—ఆ డేడ సూశినా ఆయన పేరేనండి. వోర్ని సూశినా ఆయ కొద్దకు రావటమే.

గుర.—ఆయనను చూడవలె నని నాకు చాల కోరికగా ఉన్నది; శీఘ్రముగా వెంటబెట్టుకొని రండి.

వెంక.—ఇదిగో నేనే పిలుచుకో వొస్తానండి.

[వెంకడు వెళ్లిపోవును.]

జాన.—అయ్యా! నా మాట నమ్మండి. ఇతడు చెయ్యబోయ్యేదీ మునుపటివారు చేశినంతే. ఈ వ్వారి కా వ్వారెంతో ఆ వ్వారి కీ వ్వారంతే, పదిలో పదకొండు. ఇదే మీా ఉపయోగం లేదు. మీాకొమా ర్తెకు మంచి మందేమంటే ఆమె కోరుకునే మంచి పుష్టియైన మగడే నండి.

గుర.—ఇదిగో జానకి! నీవు చాల తొందర మనిషివి.

లచ్చ.—దాయీా! నీ నోరు మూసుకో. ఇందుల్లో అంతా నూ యేలుపెట్టొద్దు. ఉమ్మం కేల ఊళ్లో పార్బత్తెం.

జాన.—ఇదిగో నే చెప్తా యినండి; యీా వోయిద్దులూ గియిద్దులూ యెవరూ గుక్కెడు నీళ్లు చేశినంతకూడా చెయ్యలేరు. మీా కొమార్తెకు యీా సొంటి పిప్పళ్లకన్న యెక్కు

కెం తాస్తి' అని అడిగేచెద్దా వాకు కుండాది. ఇదిగో సూడండి! వెంకటప్ప నాయఁడుగారు కోరి కోరి, యిచారించి యిచారించి, శానా ఆస్తి గల్లోడు, మరే - మంచి మంచి బూములు గల్లోడు. అని కొండప్పనాయని కొడుక్కు కూతుర్నిచ్చినాడు. ఇప్పుడు కూటికికూడా లేక కూలి నాలి చేస్తూ కూ కుండాడు. ఇ దోటి సాలదా మన కళ్ల ముందే. సుకం లేక యిం కెన్ని ఉంటే యేమండి. నాకూతుర్ని యిట్లాబూములు గ్రామాలు గల్లోనికి యిచ్చేందకన్నా అది కోరే మంచిదిట్టమైన మొగానికే యిత్తును.

గుర.—దాయీ! చాలు నీ యధిక ప్రసంగము. నోరు మూయుము; నీపుణ్య మగును. చాల గాశి పెట్టుకొనబోకు.

లచ్చి.—దాయీ! ఇగ సాలించు. నూ వాగనూ వొద్దు; కరేపాకు కోయనూ వొద్దు. అయ్యగారికి నీ తోలువాయి అక్కర్లేదు. ఏఁయిఁ గావాల్నో వారికి తెల్సు. నీవాల్లా ఆయనకు గావాల్సిందంతా బిడ్డకు పాలే, గాని, తప్పెటోయింపు గాదు. ఆయన అమ్మాయికి నాయన; ఆమె సుకం గుండేందుకు ఏమేం గావాల్నో శెయ్యాల్నో ఆయన సక్కంగా యెరుగును.

గుర.—తిన్నగా! తిన్నగా! లచ్చిగా! తిన్నగా!

లచ్చి.—దాని గెర్వం అణిశి, యెజమాన్ల కాడ యెట్టా నడుసుకోవాల్నో నేర్పాలెనండి.

గుర.—మంచిది; అందు కీ అభినయ మేల?

గుర.—ఈదయ్యము నెక్కడనుండి తెచ్చితిరిరా యిక్కడికి?

వెంక.—ఇతను కొంచెం యింత్రైన ఏొయిద్దు డని ముందే మనివి శేయలేదాండి.

గుర.—సరి సరి. ఇక నితని వింత చేష్టలను ఇం కెక్కడ నైన చేసి కోనిండు; పంపివేయుండి. చాలు చాలు.

లచ్చ.—ఇ యంతా మీా రంతగా పాటిం చొద్దండి. ఇయంతా అతని యేడుకలు.

గుర.—ఇట్టి వేడుకలు నాకు సరిపడవు.

గంగ.—అయ్యా! నన్ను మన్నించాల్నండీ యీా శాతలకు. యేడు కొంటూను.

గుర.—తమ దాసుండనండి.

గంగ.—నేను శానా యెసన పడ్తానండి.

గుర.—పరవా లేదు.

గంగ.—ఈకర్రతో—

గుర.—మరేమిా బాధకం లే దండి.

గంగ.—మిమ్ము బాదినందుకు—

గుర.—ఇక దాన్నిగురించి ప్రస్తావనే వలదండి. ఆఁ-మరి నా కొక్కకొమార్తె యున్నదండి. ఆమెకు ఏదో ఒక వింతయైన రోగము వచ్చియున్నది.

గంగ.—శానా సంతోషం, మీా కూతురికి నేను కావాల్సి వొచ్చినందుకు. ఇంతే కాదండీ. మీాకూ-మరి-మీా కుటుంబం లో అందరికీ నే కాబట్టి యుండాల్నని మనుసార కోరుతు డానండి.

హాఁ, అట్టనా, నే నెరగనే, అయితే మీ యిద్దరి యిష్టమైనాకు శానా సంతోసం, ఆనందం. (జానకిని నిజముగానే కౌగలించుకొనును.)

లచ్చి—(గంగన్నను ఈవలికి యీడ్చి) ఇద్దో ఆ ప నొద్దంటుంటె.

గంగ.—మీ రిద్దరు ఓటిగా శేరినందుకు నాకు నిజంగా సంతోసం గుండది. ఇట్టాంటి సొంపు, ఇంపు, పెంపు గల్లా శిన్నది నీకు యిల్లాలు గున్నందుకు నిన్ను కొనాడుతుండాను, (కౌగలించుకొనునట్లు అభినయించును). నీవాంటి మొగుడు ఆయిడకు కల్గినందుకు ఆయిణ్ణి కొనాడుచుండాను (జానకిని కౌగలించుకొనును).

లచ్చి.—(మరల గంగన్నను ఈవలి కీడ్చుచు) ఈ పొగుడింపులు కట్టిపెట్టి కొంచం దూరం గుండు. దాన్ని అంటబోకు శెప్తా, తెలిశిందా?

గంగ.—ఇంతా అనుకూలంగా మీ యిద్దర్ని కూర్చినందుకు నేను సంతోసపడ్డాను.

లచ్చి.—నాతో యెంతైనా సరే గాని, మరి, నా బార్యతో శెల్లాటం మాత్తరం యిడిశిపెట్టు.

గంగ.—మీ రిద్ద రింత సుకం గుండా రని నా మణుసులో మీపైన ప్రేమ సరిసమానం గుండది. నీపై నా కుండే ప్రేమకు నిన్ను కౌగిలించుకుంటే (అభినయించును) ఆయిడపై నా కుండే ప్రేమకు ఆయిడెను కౌగిలించుకుంటాను. (కౌగలించుకొనును).

లచ్చ.—అణ్ణి నీపై బణ్ణీను. ఊం హూం, తాకనీను.

గంగ.—ఓరి శిగ్గుమాలినోడా! బార్యపై యెంత అనుమానంరా.

గురప్పనాయఁడు మఱల ప్రవేశించును.

గురప్ప.—ఇదిగోనండి అమ్మాయి కూటములో ఉన్నది; పోదమురండి.

(అందఱును వెళ్లిపోవుదురు.)



గంగ. హా-హీ-హూ-హే-నా కేం తెల్లేదు. ఏందీ దయ్యాల బాస?

గుర.—అయ్యా! అదేనండి ఆమె బాధ; రోగం. ఆమెకు ఈమూగతన మెట్లువచ్చినదో ఆ కారణం మాకు తెలియ లేదండి. ఈయాపత్తువలననండి యీామె వివాహం నిలిపి పెట్టవలసివచ్చినది.

గంగ.—ఆ దెందువోల్ల ?

గుర.—ఈమెను పెండ్లాడ నెంచి నాతఁడు, రోగం కుదిరితేనే గాని పెండ్లినిశ్చయించుకో నంటాఁడు.

గంగ.—ఎవడా యెర్రోడు; బార్య మూగగా వుండగూడ్దనేపోడు. దైవాదీనంగా నా బార్యకేగనా యీా రోగ మొచ్చిందా దాన్ని వాశీశేయకుండా వుండేందుకు ప్రయత్నం చేస్తున్నేను.

గుర.—మంచిదండి! ఏఁ--యీావిషయములో మీారు మీా సా ర్థ్యమంతయు చూపి, యీారోగం కుదుర్చవలెనండి. నేవేఁడు కొనునదంతే.

గంగ.—మరేం బయపడొద్దు. ఏదీ నీ శెయ్ సూణ్ణి, (నాడి పరీ క్షించి) ఆఁ, మరి నాడి శెప్పతుండాది మీా కొమార్తె మూగ అని.

గుర.—అవును. అదేనండి ఆమె నిజమైన రోగము. మీారు అప్పుడే కనిపెట్టితిరండి.

గంగ.—ఆఁ హాఁ.

జాన.—సూడం డాయన యెట్ల కనిపెట్టేశినాడో ఆమె కేం రోగ మని.

గంగ.—శానా శానా గొప్పవాడు. నా కన్నా యింత గొప్ప వాడు—మరి మన మొదటి మాటండి—అది ఆఁ— కొన్ని శెడ్డ నీరులవొల్ల కలగత దని నా తలపు. దాన్నే మావొంటి వొయిద్దులు కసురునీ రంటాం. కసురు—అంటే—కసురునీరు. అది, మనం ఊపిరిడ స్తమే ఆ గాలి రోగ తత్తవంలో శేరి కలిగించే ఒక యిదమైన వొగ. అది మన వొంట్లో శేరి—ఈఁ—ఏఁ—మన మనుకొనేట్టు ఆ— ఆ—ఆ—మీకు సంస్కృతం తెలుసునా?

గుర.—ఒక అక్షరముకూడ తెలియదు.

గంగ.—(ఆశ్చర్యముతో లేచి) మీకు సంస్కృతం తెలియనే తెలీదా?

గుర.—తెలియదండీ.

గంగ.—(పెక్కువికారపు చేష్టలతో) అస్తి శిరమూణాం వాక్కుదోరణాం అమరం శబ్దమంజరీణాం ఇళా పింగళ నాడీనాం, నాడి—నాడి—అంటే నాడి, వాయూనాం ఆది త్యోబానా, సోమో యిందు, మూలపూరాషాఢ శోబనం అతిగండం—ఏ—గండం గండం- ఔను, కర్కటం మర్కటం నరం వానరం దన్వంతరీణాం, కూజంతం రామ రామేతి రామస్య రామయోః రామూనాం, ఆఁ ఔను ఔను శాంతాకారం—కారం-ఆ—బుజగ శయనం పెద్దనాబిం, అపర్ణా పార్వతి దురద, కాదు కాదు దురద కాదు, దురగా రామో దాశరదం అబరవీత్ అబ్బరవీత్—

వాయువు లుండయే అయి మయిసం గార్దబం కర్కటం మర్కటం కుక్కుటంతో శేరి, సంకరం గోపాళం గోయింపం పురానంగా కలిశిపోయి, వాక్కను ఆటంక పరస్తుండయి. అయి మీా కొమా త్రె మూాగ బొటకు కారణం.

జ్ఞాన.—ఎంత సక్కంగా, యివరంగా, శెప్పుతుండాడీ వాయి ద్దుడు.

లచ్చ.—నా నోట్లో యిట్టి మాట శేల రానీడో ఆ పాడు దేముడు !

గుర.—ఇంతకన్నా యెవ్వరూ వివరించి చెప్పలేరు - ఆ! హ, హ, హ. కాసండు! ఇందులో నా కొక్క కలవరము కలిగినదండి - గుండెకాయ కారిజముల ఉనికి. మీారు వానిని వేరువేరు చోట్లలో మార్చి చెప్పిన ట్లున్నది. గుండెకాయ యెడమప్రక్కను కాంజము కుడిప్రక్కను గదా.

గంగ.—ఔను - అయి ముందట్టే. ఇప్పుడు మేము అంతా మార్చేశినాం - మందు మాకులుకూడా యిప్పుడు యేరే యిదంగా యిస్తుండాము.

గుర.—ఓ-అట్లా-అది నే నెఱుగను. తెలియక అడిగినందులకు క్షమింపవలెను.

గంగ.—మరేం పర్వాలేదులెండి. మాహాలె మీాకు అంత నేర్పు అక్కల్లేదు సూడండి.

గుర.—హుఁ-హుఁ-హుఁ-ఔను, నిజమే—మరి యీా రోగమునకు మీారేమి చేయవచ్చు ననెదరు.

గంగ.—నే నేం శెయ్యొచ్చు నంటానా?—

గంగ.—అందుల్లో శెరుపు లేదు గాని, మేలు మాత్రరం కద్దు దప్పి తీర్చుకోనేందుకు నీల్లు తాగేట్టు, ఇక రాబో య్యే రోగాన్ని ఆపేందుకు నీరు తీయించటం మేలండి.

జాన.—వెళ్లిపోవయ్యా వెళ్లిపో! వాటినంతా నేను గవ్వకు బరాబరి శేయను.

గంగ.—అయితే నా మందు వొద్దంటావా? సరి. నిన్ను దారికి తేగలనులే. అయ్యా! యిక నేను శెలవు తీసుకుంటానండి.—

గుర.—ఒక్క నిమిషము దయచేయండి.

గంగ.—ఏం గావలె?

గుర.—మీకు మీ కట్న మిచ్చుటకండి.

గంగ.—(చెయి చాచి) మరేమి అవసరం లేదులెండి.

గుర.—ఉండనీయండు.

గంగ.—నేనండీ - ఆ - డబ్బుకు వొయిద్దెం శేయటం లేదండి.

గుర.—నే నెరుగుదునండి. ఇవిగో తీసికోండి. (తాంబూలముతో ఇచ్చును. తీసికొని మంచివేనా యని తట్టిచూచును).

గంగ.—నేను డబ్బాశ గల్లోడు గానండి.

గురు.—నేను చక్కగా నెఱుంగుదును.

గంగ.—ఇంక నాకు శెలవండి.

గుర.—సరి, సరి.

(ఇరువురును వెళ్లిపోవుదురు.)

---

లేకున్నదండి. అందువల్ల ఈ మోహాము విషయమై మీరు కొంచెము సహాయము చేయవలెనని ప్రార్థిస్తున్నానండి. అంటే ఆమెతో నేను వొక కొన్ని మాటలాడుటకు వన్ని యుండుయుక్తి సాధనములలో మీ సహాయము నాకు అవశ్యంగా కావలెనండి. నా ప్రాణము, నా సుఖము, అంతా ఈ కార్యమును అనుసరించి ఉన్నదండి.

గంగ.—(కోపముతో) న న్నేవ లనుకొన్నావు? నీ యీ మురులు యిసయంలో నన్ను తోడుపడమనేందుకు నీ కేం పోతరమా? బలే గొప్ప వొయిద్దుణ్ణి! నన్ను - నన్ను—నన్ను—ఈ బిసాత్ నామరదా బడవా పనికి రమ్మంటావా? నా పరువేం? నా పెత్తనమేం? బడివే!

లింగ.—అయ్యా! అయ్యా! అరవబోకండి. అరవబోకండి.

గంగ.—నేను అరస్తాను; కేక లేస్తాను. తలపాగుచుపట్టిన దొంగా!

లింగ.—మెల్లగానండి మెల్లగా, మెల్లగా.

గంగ.—పరువులేని కుక్క!

లింగ.—అయ్యా! మిమ్ము వేడుకొంటానండి. అరవొద్దండి—అరవొద్దు.

గంగ.—నే నెవ ఱైందీ తెలుపుతా వుండు. ఇంతా తల బిరుసా?

లింగ.—(ఒడినుండి రూపాయల తిత్తి నెత్తి యిచ్చుచు) అయ్యా! వొయిద్దులుగారూ!

యెత్తు యెత్తింది. ఆ–మనంయిద్దరూ ఇక్కణ్ణుంటే యెవరైనా చూచిపోదురు. ఇక్కణ్ణుండి వెళ్లిపోదము. పోతూ పోతూ, దారిలో, మీవల్ల నాకేం సహాయం కావలెనో తెలుపు కొంటానండి.

గంగ.—మంచిది, మంచిది, అల్లే. నీమగులు నాకెక్కడలేని శివంపుట్టించింది. ఎన్ని మందులన్నా యిచ్చి ఆయిణ్ణి నీకు దక్కిస్తాలే.

(ఇరువురును వెళ్లిపోవుదురు.)

---

లింగ.—ఏమీ! అయితే మీరు సిజంగా వైద్యులు—

గంగ.— కాను అంటాను. నే నెంత శెప్పినాగాని యినక వారు నన్ను వొయిద్దుణ్ణి శేశినారు. నే నంత సదువు సదవ టానికి యెప్పుడూ తలచుకోనే లేదు. నా సదువల్లా బాల శిక్ష బాల్రామాయణం అమరం అంతా ఆరంబంలోనే అయిపోయింది. వారి కీ యెట్రి యెట్ట పెట్టిందో గాని, ఎంత శెప్పినా నా మాట వినక, నన్ను వొయిద్దుడు గమ్మని బలమంతం శేస్తే, ఆ కష్టం వోర్వ లేక "యిది లేక వొయిద్దు" డైనాను. నూ నమ్మవు గాని, కడకు నా వొయిద్దె పూరంతా అవాదా పుట్టిపోయింది. ఎవడు సూశినా యిదే మాటగా నేను గొప్ప వొయిద్దుణ్ణనుకుంటుండారు. యాడా ణ్ణుండో శానా శానా దూరాన్నుండి నాపెద్ద కొస్తుండారు. ఇట్టేగినా కడవరదాకా జరుగుతుంటే, ఇగ సచ్చే దాకా వొయిద్దెమే బదుగ్గా శేస్కుంటామూ అని తలస్తుండా. అన్ని పనులకన్నా యీవొయిద్దెంప నుండదే యిది శానా మేలైంది. మనం తప్పు శేశినా వొప్పు శేశినా డబ్బేమో యిచ్చేస్తారు. ఎంత పొరబాటైనా మనకు కష్టం లేదు; తోశినట్లల్లా శేస్తుండొచ్చును. కడకు మాదిగోడు శెప్పులు కుట్టండలో ఓ శిన్నా తోలువారు శెరి శేశినా వాడు డబ్బచ్చుకోవాల్సినోడే; కాని మన పనిలో తిల్లిగవ్వ కూడా నష్టం లేక, ఓర్ని గాని సంపెయ్యొచ్చును, తప్పేమో మన మీద యెప్పుడూ మోపరు. అదేమో సచ్చినోనిదే. కుల్లుకు ఈపనిలో శానా అగిత్తమైన సంగతేమంటే, సచ్చినోరి

తిమ్మ.— ఔనండి. అంతేనండి, ఆయిడ ఒల్లంతా యిట్టా (చేతులతో చూపుచు) బరాయించుకుండాదండి. కడుపులోనంటా ఏం టేంటో శానా శానా రోగాలు శేరుండాదంటండి. మరి - గుండెకాయో - అది మరి - పొట్టో - ఆ ఆఁ అద్దది పేవులు, గుల్మమంట, అదేం మాటో, మీకు తెలస్తది వొయిద్దులకు.

గంగ.— ఆఁ - ఆఁ.

తిమ్మ.— అందుల్లోనంటా నెత్తురుకు బదులు నీళ్లు ఊట పెడుతుండదంట. మరి - దిన మిడిశి దినం - అంటే, యీ యాలైతే రేపు లే యెల్లుండి - అట్టా ఆయిడెకు జొరమొస్తుందండి. ఒల్లంతా నెప్పులు. తలంతా తిప్పులు. కాల్లకాడ పిక్కల్లో నరాలు యీడస్తదంటుండి.

గంగ.— ఉఁ - ఉఁ—

తిమ్మ.— గొంతులో గుర్రు గుర్రు మంటా గళ్ల యినబడతదండి. దగ్గితేబైటికి రాదు గాని - అప్పుడు గుడ్లు తేలేశి కాలూ శేతులూ యీడస్తుందండి. ఆ దగ్గినప్పుడల్లా ఊపిరెల్తుందేమో ననిబయమేస్తుందండీ.

గంగ.— మరి వొయిద్దెం యేమన్నా శేయించినావా?

తిమ్మ.— మావూళ్లో ఓ వొయిద్దు డుంటాడు; పెద్దా పెద్ద మాత్తర్లిచ్చేవోడు. బలే డబ్బు లాగేవోడండి. ఇప్పటి దాకా మేము పదిరూపాయల దాకా యిచ్చుకున్నామండి. ఆయిన వొయిద్దెం శేశిపూటకు నిమ్మకాయంత మాత్తర్లిచ్చినాడండి అంతేకాక, మెర్రిపుచ్చకాయ, గన్నేరేల్లు, గచ్చా

పెద్ద.—మరండి, మా యమ్మకు వొల్లు కుదురు లేదండి, ఆ ర్నెల్లుగా. ఇయిగోనండి రొండు రూపాయలు తెచ్చుకు న్నామండి మీగ్గాను. ఏదన్నా మం దియ్యాల్నండి. (అని రూపాయలు యిచ్చెను.)

గంగ.—ఆఁ - ఇప్పుడు నాకు తెలుస్తుండది. నూ సక్కంగా శెప్పేవోడు; ఎట్ట శెప్పాల్నో అట్ట శెప్పేశినావు. ఏఁ- నూ అనేదేం - నీతల్లికి నీరుయాది; ఒల్లంతా వా చుండాది; జొర మొస్తుండాది; కాళ్లలో నెప్పు లుండాయి. అప్పు డప్పుడు వోయి పీడ్పులు వొస్తుండాయి అనిగదా?

పెద్ద.—ఔనండి, అంతే, అంతే. ఒల్లద్గొ - అదే - అదేనండి.

గంగ.—నీవు శెప్పేది యెంటనే తెలుస్తది. నీ నాయన శెప్ప టం యేందో ఆయనే యెరగడు. ఆఁ - మ రిప్పుడుమీాకు మం దిమ్మంటారుగదా నన్ను—

పెద్ద.—ఔనండి, ఔ, ఔ.

గంగ.—అంటే ఆమె రోగం కుదిరేందుకు మఁదు.

పెద్ద.—ఆఁ - ఆఁ - ఔ, అ ల్లదేనండి - అదే, అదే.

గంగ.—ఇగో! దీన్ని తీస్కో. ఇదుండాదే, యిది రాగిరొట్టె తునక; దీన్ని ఆమెశా త్తినిపించు.

పెద్ద.—రోగిరోట్టె తునకాండి!

గంగ.—ఔను. ఇందుల్లో శానాశానా మందు దినుసులు శేరుండాయ్. మరి బంగారం, యెండి, పొగడం, ముత్తాలు- ఇంగా యేంటేంటో శానాశానా ఉండాయ్.

మూడవయంకము - రెండవరంగము.

---

గురప్పనాయుని యింటివెనుక నుండు తోట.

* ఒకవైపు జానకియు, నింకొకవైపు గంగన్నయును ప్రవేశము.]

గంగ.—ఇగో వస్తుండాది. మంచి లంచడీ, దాయి. ఆ - హా - హా-దాయమ్మ - రాయమ్మ - బాయమ్మ - రా - రా - రా - రా - హి - హీ - హి - నిన్ను సూస్తే నా కెంతో ఆనందం గుండది. నీరూపు, (ఇట్టటు క్రీగంటితో జూచుచు) నీ యీపు, నీ మూపు, నీయూపు, నీ సూపు, నీ మేపు, మరి నీదాపు అంతా యెట్టుండాదంటే కరక్కాయ, ఆమిదాలు, నేర్యాళంగా ఉండది. నామనుచులో దుక్కం అంతా పారి నీరై పోతుండాది.

జానకి.—ఔరా బాగ్గెమా, వోయిద్దులూ! ఇట్టాంతా నాతో మాట్టాడితే పెయోజనం లేదు. అదేందో నీ బాస నాకు ఒక్కమాటకూడా తెలవటం లేదు.

గంగ.—అయితే రోగం తెచ్చుకో, ఆఁ - అంతే. నిన్నేడు కొంటా నాపైన మరులుకొని రోగం తెచ్చుకో. నీరోగం కుదిర్చి నేను బెమ్మానందం గొంటా.

జాన.—నే నేం పనికత్తెనండి. నాకేం రోగమొద్దు గీగమొద్దండి.

గంగ.—దాయీ! నిన్ను సూస్తే నాకు శానా జాలి గుండది. పాపం, నీకు యిట్టాంటి సంకరమోటు, శింతమొద్దు, మొగుడు గుండాడే అని.

జాన—ఔ; నిజమేనండి. అట్టేశేస్తు గానిండి, ఆయనమీాద మాత్రరం నాకు మణునార, మోగ ముండది. లేకుంటే బలేబలేయింత పను లన్నీ శేయగల్దును.

గంగ.— మంచిది! మ రిం కెవరి నన్నా సూసుకొని వాని మీాద కశితీర్చుకుంటే బాగున్నే. ఆ బరికాలి నాయాలికి అంతా బాగాకావాల్చిందే. (నిట్టూర్పు) దాఁయీా! హాయిగా నేనేగినా అదుష్టం గల్లోడుగుండి-నాశిన్నారీ, పొన్నారీ, నాశిలకా, గిలకా, ఆ-ఆ-ఆ- కోరుకొనే-(ఇంతలో యిరువురును దూరమున నున్న లచ్చన్నను చూచి తలా ఒక మార్గమున పారిపోదురు. లచ్చన్న ప్రవేశించి వారు తన్ను మోసముచేసి పారిపోయిరి గదా యని వారి దారి చూచుచుండఁగా, గురప్పనాయుఁడు ప్రవేశించును.)

గుర— లచ్చన్నా! వైద్యు లేమన్నా వచ్చియుండిరా, చూచితివా?

లచ్చ.—వొచ్చారు; సూశాను. (తనలో) ఆ దయ్యాన్నీ సూశాను. మరి నా బార్యను సూశాను.

గుర.— ఎక్కడ నున్నారు?

లచ్చ.— ఎరగనండి (తనలో) ఏట్లో.

గుర.— వెళ్లి. అమ్మాయి యేమి చేస్తున్నదో చూచి రా.

(లచ్చన్న పోవును.)

గంగన్నయును - లింగమనాయుఁడును ప్రవేశము.]

గుర.— ఆహాఁ— రండి రండి. మిమ్మునే విచారించుచుంటిని.

గంగ.— తోటలో తాఁటిశెట్లు కింద దాగం పుచ్చుకొని యేడుగ్గా వుంటినండి-ఏఁ అమ్మాయి కెట్టుండది.

వెళ్లుదురు. గంగన్న, గురప్పనాయుని మరియొక ప్రక్కకు తీసికొని వెళ్లి, లింగమనాయుఁడు లక్కమ్మతో మాటలాడుట అతని కనులపడనీయక, చూచినప్పుడెల్ల అడ్డముగా నిలుచుకొనుచుండును.)

గంగ.—ఏమండీ వొయిద్దులలో ఒక్క యివాదమండి. అది బలేసూక్షం. ఏమంటే. ఆడోళ్లకు రోగం కుదిర్చేది సులబమా, మొగోళ్లకు రోగంకుదిర్చేది సులబమా, అని.- మా రీ - ఇది మీరు గమనించ వాల్సిన సంగతండి - ఏఁ కొందరు "కాదు" అంటారు. కొందరు "ఔను" అంటారు. మరి నే నే మంటా నంటే "ఔను" "కాదు" అని రెండూ అంటాను. ఎట్టాంటే:—ఆడవాళ్లుండారే స్త్రీలు - వారి ఒంట్లో అంటే దేగంలో వుండే సాబావతత్వంలోని శేడ్డనీరు, అంటే కసురునీరు అంటే ఒకటితో ఒకటి శేరి పొంది గ్గాని కసురునీరు అంటే ఉసపునీరు పంచాంగాల్లో జ్ఞానేందిరాన్ని అణిచేశేందుకాత వారి అబిప్రాయం శెదక మైపోయి చంద్రమండలంయొక్క ఐమూల తిరుగుళ్లను అనుసరించి ఉండది.

(లక్కమ్మయు, లింగమనాయుఁడును దూరమున మాటలాడుచు ప్రవేశము.

గంగ.—అంతేకాక సూర్యుడు తనకిరణాలను యీబూమియొక్క పల్లపువాటున పడేట్టు శాయడంశాతను.

లక్క.— లేదు నామనస్సు నెప్పుడూ మార్చలేను.

గుర.— వినండి-వినండి- అమ్మాయి మాట్లాడుతున్నది. ఆహాహా! ఏమా మందు ప్రభావము. ఏమి ఘనవైద్యులు. ఆహా

లక్ష్మి.—వల్ల నైనంత ప్రయత్నింప వచ్చును.

గుర.—అది...

లక్ష్మి.—అటువంటి దౌర్జన్యమునకు నామనస్సు లోఁబడదు.

గుర.—ఇదిగో...

లక్ష్మి.—నాకు యిష్టం లేనివాని పెండ్లాడేందుకన్న ఎక్కడి కైనా బైరాగులతో చేరిపోదును.

గుర.—ఉం - అయితే...

లక్ష్మి.—(ఉచ్చస్వరముతో) కాదు—ఏవిధముననుకాదు— ఉపయోగంలేదు - ఎందుకు ఆయాస పెట్టుకుంటారు - అటు వంటి పని కేమీా నే నొప్పుకోను - నామనస్సులో తీర్మానం చేసుకున్నాను.

గుర.—ఏమి యీాప్రేలుటలు, వాగుటలు. ఇందుల కెవ్వరు నెమరు నిల్వలేరు. ఊఁ, అయ్యో! వైద్యులుగారూ, ఈ మెను మరల మూఁగగాఁ జేయ లేరా - మిమ్ము వేడుకొనె దను.

గంగ.—అది అసాధ్యం. ఊఁ హుఁ. అయ్యేపని గాదు - మరి మీాగ్గావాలిస్తే, నేను శేయగల్గా దంతా మిమ్ము శెవిటి వాణ్ణిగా శేయడమే.

గుర.—అనేకవేల దండములు. అట్లైన నిక...

లక్ష్మి.—లేదు. కాదు. మీా రేమి చెప్పినా అవేవి ఉపయోగ ములుగావు.

గుర.—నీవు ఈదినమే ఆ యాదెప్పనాయుని పెండ్లాడి తీర వలెను.

లియ్యి. యెల్లు. యేమైన సరే; ఆలిశ్యింకూడు. యెంటనే కావాలె. ఆ మందే యియ్యాలె.

[లక్కమ్మయును - లింగమనాయుడును వెళ్లుదురు.

గుర.—అయ్యా మీారిప్పుడు చెప్పిన ఆ మూలిక లేవండీ. ఇంతకుముం దెన్నడూ అట్టిపేళ్లు విన్నట్టే జ్ఞాపకము లేదు.

గంగ.—అవన్నీ, ఇట్టాంటి రోగాలకు కట్టకడపటమాత్రమే వాడాల్సింది.

గుర.—ఇట్టి పోగురుపోతుతనము నెందైన చూచితిరా?

గంగ.—ఆడపిల్లలు యెప్పుడుగాని కొన్ని యేళ్లల్లో ఇట్టా కొంచెంమూర్కెం గుండేది కద్దు.

గుర.—ఆమెకు ఆ లింగమనాయునిమీాద యెంత పిచ్చి మోహ మున్నదో చూడండి.

గంగ.—శిన్నవోరి వొంట్లో నెత్తురు వారి నట్టా శేయిస్తది.

గుర.—ఇంత యెక్కువ మోహ మున్న దని నేను కనిపెట్టిన వెంటనే ఆమెను కదల మెదల నీయక లోపలనే యుంచి తలుపు తాళం వేయించినాను.

గంగ.—బలే మంచి ఉపాయం సేస్తిరి.

గుర.—మరి వా రిద్దరికిని యేమాత్రపు ఉత్తరములు జరగకుండా ఆపివేసినాను.

గంగ.—మంచిపని; బాగుండది.

గుర.—ఒకరి నొకరు చూడఁగల్గియుండిన నేడైన దుర్మార్గము చేసియే యుందురు.

గంగ.—అడ్డంలేక.

## మూఁడవయంకము - మూఁడవరంగము.

---

### గురప్పనాయునితోఁట.

[ఒక ప్రక్క గంగన్నయు లచ్చన్నయు నుందురు.
మఱియొక ప్రక్క మల్లక్క ప్రవేశించును.]

మల్ల.—ఓరి బగమంతుడా! ఈసోటు కనుక్కోటాన్కి యెంతా కష్టమైంది. మాతాత లెల్లొచ్చారు— (లచ్చన్నను చూచి) ఆ! ఉండారా. అయ్యా! నేను మీకు శిపారసు శేశినా వొయిద్దుడు యాడుండాడు.

లచ్చ.—ఇగో, ఉండాడు. గాలాలమిట్టలో ఉయ్యా లూగేందుకు శిద్దంగుండాడు. అంటే ఈణ్ణి వురితీయబోతారు.

మల్ల.—ఏమీ నా మొగుణ్ణి ఉరితీస్తారా? అయ్యయ్యో. ఆఁ ఎందుకయ్యా, ఆయన్ను వురితీయటం.

లచ్చ.—మా నాయుడిగారి కొమార్తెను లేవదీసుకో పొయ్యేందుకు యీడుతోడుపడ్డాడు.

మల్ల.—అయ్యయ్యో! మామా, మామా! నిన్ను గల్లు కేస్తారా? ఆఁ! నిజమేనా!

గంగ.— (నిట్టూర్పుతో) హుఁ.

మల్ల.—ఇంద రెదట నిన్ను సంపేస్తారా?

గంగ.—నేనేం శేయగల్దు.

లార గ్రహించెదను. ఇప్పుడే ఇంతకుమునుపు నాకు కొన్ని జాబులందినవి; అందు నాపినతండ్రి కాలముచేసినట్లును, ఆ యన యాస్తికంతటికిని నేను వారసుడనై నట్లును, తెలియ వచ్చుచున్నది. (జాబులు చూపును.)

గుర.—మంచిది. నీగుణములు మెచ్చుకొనవలసినవి. లోక మున లేనంతటి మహదానందముతో నాకుమార్తెను నీ కిచ్చెదను.

గంగ.—వోయిద్దుడు కొంచెంలోనే తప్పించుకొన్నాడు.

మల్ల.— సరి, నూవు ఊరినుండి తప్పించుకున్నావు. కనక నిన్ను నేను వోయిద్దుణ్ణి శేశినందుకు ఇల్లిగ్గో నన్ను పొగడుతుం డ లె. తెల్సునా. నీకాపరువు తెచ్చింది వోరనుకున్నావు నేను గామాల.

గంగ.—ఔనౌను. నాకు దెబ్బలు బాదులు తెప్పించింది కూడా నువ్వేగదా.

లింగ.—కల్లుకు ఫలితమేమో లాభకరమే ఐనది

అని గంగన్న చేతి కొకవరహాలసంచి నిచ్చును.

గంగ.—(ఆనందముతో) అట్టైనండి - ఇదిగో నేవ్. నన్నింత పెద్ద శేశినందుకు నిన్ను మన్నిస్తా. మఱి ఇకమీద యింత పరువుపెత్తిప్పలు గల్లా నావొద్ద బలేగౌరవంగా నడుచుకో వాల తెలస్తదా. దానికి నేర్చుకో. అంతేగాదు. ఇంకోటికూ డాకద్దు. ఏమంటే వోయిద్దునికోప మున్నాదే అది అందఱి కోపమొంటిదిగాదు. బలేమెక్కువైంది తెల్సునా?

# ఆంధ్రగ్రంథములు.



## వచనములు.

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి | |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీ శతఘంటము వేంకటరంగశాస్త్రికృతము | ... | 6 | 8 |
| డిటో 3 వాల్యుములు | ... | 7 | 0 |
| శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | ... | 3 | 8 |
| ద్వాదశోపనిషత్తులు, సంస్కృతమునకు సరియైన తెలుగువచనము | | 3 | 0 |
| ఋజ్వేదకథాసంగ్రహము | ... | 0 | 8 |
| ోజునికథలు | ... | 0 | 8 |
| ుక్రమార్కునికథలు | ... | 0 | 8 |
| రేచుక్కపగటిచుక్కకథలు | ... | 0 | 3 |
| ుర్యాదరామన్నకథలు | ... | 0 | 2 |
| ారిష్యావినోదకథలు | ... | 0 | 12 |
| శ్రీవివేకానందవిజయము | ... | 1 | 12 |
| ారతరమణీమణులు, ప్రథమభాగము | ... | 0 | 12 |
| ,, రెండవభాగము | ... | 0 | 8 |
| ివనాథభక్తులచరిత్ర, శ్రీ బచ్చు రామన్నగారు | ... | 2 | 0 |
| ీతిచంద్రిక, శ్రీ చిన్నయసూరిగారిది | ... | 0 | 6 |
| ంచతంత్రము, సులభశైలి | ... | 0 | 6 |
| ాతోపదేశము ,, | ... | 0 | 12 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి. ఈ.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| గైక్వారుగారి ఉపన్యాసము | ... | 0 | 2 |
| రతుకాన్ గ్రెస్సు ఉపన్యాసములు | ... | 0 | 2 |

## చరిత్రలు.

| | | | |
|---|---|---|---|
| శ్రీరామానుజాచార్య చరిత్ర | ... | 0 | 2 |
| ్వామిరామతీర్థజీవితము | ... | 0 | 2 |
| ఆలీసోదరుల జీవితము | ... | 0 | 4 |
| త్తరంజనదాసు | ... | 0 | 4 |
| లివాహనచరిత్ర | ... | 0 | 3 |
| శ్రీగోపాలకృష్ణగోఖ్లేగారి జీవితము | ... | 0 | 2 |
| ివాజీచరిత్ర | ... | 0 | 8 |
| శ్రీశంకరాచార్యచరిత్ర | ... | 0 | 3 |
| శ్రీవేమనయోగి జీవితము | ... | 0 | 2 |
| దాభాయినౌరోజీచరిత్ర | ... | 0 | 2 |
| శ్రీకరంచంద్ గాంధిచరిత్ర | ... | 0 | 4 |
| బుద్ధచరిత్రము | ... | 0 | 4 |
| దనమోహనమాళవ్యాగారి జీవితము | ... | 0 | 2 |
| శ్రీరామకృష్ణపరమహంసచరిత్రము, ప్రతిమతో | ... | 0 | 3 |
| పోలియన్ చరిత్రము | ... | 0 | 4 |
| ాదరినివేదితజీవితము | ... | 0 | 2 |
| ాంగచైతన్యస్వామి జీవితము | ... | 0 | 4 |
| శ్రీగైక్వారుగారిజీవితము | ... | 0 | 2 |
| శ్రీవివేకానందస్వామిజీవితము | ... | 0 | 2 |
| కృష్ణదేవరాయచరిత్ర | ... | 0 | 3 |
| రుక్లైవు జీవితము | ... | 0 | 8 |
| ానిబిసెంటుచరిత్ర | ... | 0 | 4 |
| రావణచరిత్ర | ... | 0 | 1 |
| శ్రీలాలా లాజ్ పతిరాయిజీవితము | ... | 0 | 2 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ౦దన మోహన మాళవ్యగారి జీవితము, పంజాబుఅల్లరి | ... | 0 | 8 |
| ౦ంఘిక దౌర్జన్యము | ... | 0 | 14 |
| ౦ంజాబు అల్లరి, సహాయనిరాకరణోద్యమము, దేశీయమహాసభ వారిచే నిర్ణింపఁబడిన కమిటీవారి రిపోర్టు ననుసరించి ఆంధ్ర ప్రజాసంఘమువారిచే చిత్రపటములతోఁ బ్రకటింపఁబడినది. | | 0 | 8 |

## వివిధగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| బాలవ్యాకరణము, శ్రీ చిన్నయసూరిగారిది | ... | 0 | 12 |
| వెంకయ్యవ్యాకరణము (ఆంధ్రవ్యాకరణము) | ... | 0 | 4 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక | ... | 0 | 8 |
| హిందీ ఇంగ్లీషుబాలశిక్ష | ... | 0 | 4 |
| హిందీ తెలుఁగుబాలబోధ | ... | 0 | 3 |
| హిందీ తెనుఁగు మొదటివాచకము | ... | 0 | 8 |
| పెద్దబాలశిక్ష, నూతనముద్రితము | ... | 0 | 8 |
| ,, మేలు కాకితములు | ... | 0 | 12 |
| ,, కాలికో బైండు | ... | 1 | 0 |
| ఆంధ్రద్రవిడబాలశిక్ష, అరవ మభ్యసింపఁదలచు ఆంధ్రులకు మిక్కిలి యుపయోగము | ... | 0 | 3 |
| తెలుగుసామితెలు, ఇంగ్లీషుతర్జుమాతో | ... | 1 | 0 |
| ౦సుదేవమననము, వచనము | ... | 0 | 12 |
| బాలచంద్రోదయము, అలఘుకౌముది | ... | 0 | 8 |
| ౦ర్థచంద్రిక, శ్రీమహాకాళి సుబ్బారాయకృతము, ఆంధ్ర నిఘంటువు, క్రొత్తకూర్పు | ... | 4 | 0 |
| గాంధిమహాత్ముని హైందవస్వరాజ్యము | ... | 1 | 0 |

## సీతారామాంజనేయసంవాదము, సటీక

అనేక నూతనవిషయములఁ జేర్చి చిన్నసైజున చక్క ముద్రించినారము. టీక మిక్కిలివిపులము. పీఠికలో కవిచ కూడ విపులముగ వ్రాయఁబడియున్నది.

సాధారణప్రతి రూ. 2-0-0. మేలుప్రతి కాలికో రు. 3-

## విషవైద్యచింతామణి, సాంధ్రతాత్పర్య

ఇందు తేళ్లు, పాములు, పిచ్చికుక్కలు మున్నగు స జంతువుల కాటులకును చికిత్సలుగలవు. విషవైద్యగ్రంథ లో నిట్టి దింతవరకు ప్రకటింపఁబడలేదు.

ప్రతి 1-కి రూ. 2-

## చక్రదత్త (వైద్యము.

ఇది చక్రపాణి విరచితమగు ఉత్తమమైన వైద్యగ్రంథ ప్రతి ఆయుర్వేదవైద్యులును, తద్విద్యార్థులును ముఖ్యమ పఠింపవలసిన ఉత్తమోత్తమ గ్రంథము. రూ. 3-12-

## భర్తృహరి సుభాషితము.

సవ్యాఖ్యానాంధ్ర పద్య టీకా తాత్పర్యసహితము.

ఇందు ఏనుగు లక్ష్మణ కవి, ఎలకూచి బాలసరస్వతి, పు రి తిమ్మన— ఈముగ్గురి ఆంధ్రపద్యముల చేర్చి చక్క ముద్రించినారము.

గిల్టు పేరు, కాలికోబైండు ప్రతి 1-కి